# గురువాణి

(గురునానక్ 'గురుగ్రంథసాహ్' నుండి ఓ అనువాద ఖండిక)

ప్రాపంచిక వాసనలను
రంగరించి సిరా చేసి
నిర్వికార నిర్వికల్ప నిర్మల నిజమానసమను
కాగితమును చేత గొనుము
కలము చెలిమి చేసికొనుము
మదికి ముదము నొసగు మృదుల
పదముల వెలయించు నెడద
కూర్చుకొనుము గురుపదములు
కొలచి రచన నేర్చుకొనుము
వ్రాయుమతని నామములను
పాడు మతని దివ్యమహిమ
అతడనంతు డప్రమేయు డక్షయు డవ్యక్తుడనుచు
తెలిసి తెలియ వెలయించుము
తొలి తెలివిదియని జనులకు
అదే రచన అదే గణన
అదే లేఖ అదే రేఖ
అదే ఇహము అదే పరము
ఇది గురు నానకుని పదము.

# కారుణ్య ఘనత

వాడనొల్లక వికసించు వారిజములు
దీప్తి వీడని నక్షత్ర దీపమాల
కరిగి కురియగ నేరని ఘన నిచయము
ముత్యములు రాల్చి మురియని ముదిత కనులు
ప్రణయ గౌరవ మెరుగని ప్రాణికోటి
స్నేహ జర్జరనశ్వర దేహ జనిత
శోక సారస్య మెరుగని నాకభోగ
సారములుమాకు కరుణోపహారములట
వలదు! కారుణ్య ఘనత కావలయు మాకు!!

(సుప్రసిద్ధ హిందీ కవయిత్రి మహాదేవి వర్మ
– గేయానికి భావానువాదం – 1952)

# మీమాంస

షట్పదావృత పరిపుల్ల సరిసిజంబు
వాడి గాలికి ధూళిపై పడి యొనర్చు
మర్మర ధ్వని వినుమడే మారు మూల-
ఎంత అస్థిర సౌందర్య మీ జగంబు!

కిస లయాధర మధు సుధా రసము గ్రోలి
సురభి వెదజల్లి విహరించుచున్న దదిగొ
మంద మలయజ మాధవీ మారుతంబు
ఎంత మాదక వాహ్యాళి యీ జగంబు!

స్వాతి సలిల పిపాసతో చాతకంబు
ప్రియ, ప్రియా! యని విలపించి విసుగు చెంద
అగ్ని కణములు కురియించు నంబుధరము-
ఎంత నిష్ఠుర పరిహాస మీ జగంబు!

సుఖ నిశానంద డోలికా సుప్త భువిని
పరిహసించుటకై సుధాకరుడొనర్చు
చంద్రికా హాస మాధుర్య సార మిదియె-
ఎంత పిచ్చిని పడి పోయె నీ జగంబు!

ఆధారం : మహాదేవి